# రాష్ట్ర వార్తలు

## ప్రతి జనవరి 11 న జీవకారుణ్య దినం జరపాలని గుంటూరు జీవరక్షా సంఘం సూచన

గుంటూరు, జనవరి 22 : శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి జ్ఞాపకార్థంగా ప్రతి సంవత్సరం జనవరి 11 వ తేదీన దేశంలోని జంతువధశాలలన్నిటినీ మూసివేయాలని ఇక్కడ గాంధీపార్కులో 'జీవరక్షా సంఘం' ఆధ్వర్యాన జరిగిన బహిరంగసభలో తీర్మానించారు.

జంతుబలులను రూపుమాపేందుకు వీలుగా 1960 సంవత్సరపు పి.సి.ఎ. చట్టాన్ని సవరించాలని, 1959 సంవత్సరపు మద్రాసు పశుపక్షి బలి నిషేధ బిల్లును వచ్చే శాసనసభా సమావేశంలోనే ప్రవేశపెట్టి వెంటనే శాసనం చేయించాలని కోరుతూ తీర్మానం చేశారు.

జంతు సంక్షేమ వారోత్సవాల సందర్భంలో ఏర్పాటుచేయబడిన ఈ బహిరంగసభకు శ్రీ వడ్లమూడి వెంకటలక్ష్మీ నరసింహారావు అధ్యక్షత వహించారు. రాష్ట్రపతి రాధాకృష్ణన్, గవర్నరు గిరి, శ్రీ లలోకమోహతా, శ్రీ కె.ఎం. మున్షీ, శ్రీ సి.పి. రామస్వామిఅయ్యరు మొదలగువారు పంపిన సందేశాలను శ్రీ పీలా రామకృష్ణ చదివి వినిపించారు.

డా. సుశీలాదేవి, శ్రీ ఎస్. గోపాలకృష్ణమూర్తి, శ్రీ పీలా రామకృష్ణ జంతు సంక్షేమంకోసం ప్రజలు, ప్రభుత్వాలు చేయాల్సిన విధులను వివరించారు.

మూడు హైస్కూళ్లలో జరుపబడిన వ్యాస రచన, వక్తృత్వ పోటీలలో ప్రథమ ...

## హరిశ్చంద్ర హెడా సంఘం సిఫార్సులు

### టెక్కలి హరిజన సేవక సంఘ వ్యతిరేకత

టెక్కలి, జనవరి 22 : టెక్కలి ప్రాంతం హరిజన సేవక సంఘ కార్యకర్తలు ఈ 20వ తేదీన శ్రీకాకుళంజిల్లా హరిజన సేవక సంఘం కార్యదర్శి శ్రీ బి.ఎం. రెడ్డి అధ్యక్షతన సమావేశమై, పార్లమెంటు కాంగ్రెసుపార్టీ శ్రీమతి ఇందిరాగాంధిని నాయకురాలిగా ఎన్నుకున్నందుకు ఆ పార్టీని అభినందిస్తూ తీర్మానించారు.

ప్రపంచరాజ్యాలలో భారతదేశాన్ని సుగౌరవంగా నిర్వహించుకు వచ్చేందుకు, ప్రపంచ ప్రజల అభ్యుదయంకోసం తాష్కెంట్ ఒప్పందాన్ని తు.చ. తప్పకుండా అమలుజరిపేందుకు శ్రీమతి గాంధికి తగు శక్తిసామర్థ్యాలు అభించజేయవలసినదని సమావేశం భగవంతుణ్ణి ప్రార్థించింది.

విమ్నజాతుల జాబితానుంచి మాలకులాన్ని తొలగించాలంటూ శ్రీ హరిశ్చంద్ర హెడా సంఘం చేసిన సిఫార్సును ఆమోదించవద్దనీ, ఆ సిఫార్సును ఆమోదించినట్లయితే మాల కులానికి రాజ్యాంగరీత్యా కలిగించిన సాంఘిక న్యాయాన్ని దక్కకుండా చేసినట్లు అవుతుందని పేర్కొన్నది. శ్రీకాకుళం జిల్లాలోని ఎట్టి కులానికిచెందిన అస్పృశ్యులను ఆంధ్రప్రదేశ్ విమ్నజాతుల జాబితాలో చేర్చాలనికూడా సమావేశం కోరింది.

## తెనాలి న్యాయవాదుల సంఘం కార్యవర్గం

సిం ఋధవారం ఢిల్లీవచ్చిన అమెరికా ఉపాధ్యక్షుడు శ్రీ హంఫ్రీ, కేంద్ర ఆహారమంత్రి శ్రీ సుబ్రహ్మణ్యంతో సమాలోచనలు జరిపినట్టు తీసిన ఫొటో

# సార్థక జన్ముడు లాల్ బహదూర్

## రాష్ట్రంలో సంతాప సభలు: జోహార్లు

("ఆంధ్రపత్రిక" ప్రతినిధి)

హైదరాబాద్, జనవరి 22: సామాన్య కుటుంబీకుడుగా జన్మించి అత్యుత్తమమైన, బాధ్యతాయుతమైన స్థానాన్ని అలంకరించి ప్రశంసనీయంగా వ్యవహరించిన పురుషుడు, నిష్కామయోగి అని కీ. శే. లాల్‌బహదూర్ శాస్త్రికి నేడు పలువురు ప్రముఖులు ఇక్కడ జోహార్లర్పించారు.

ఆయన గుణగణాలను ప్రస్తుతించుకొనేందుకు బృందావన్ హోటల్ భవంతిపై ఆవరణలో విజయనగర కాలనీ మిత్రసంఘం వారు ఏర్పాటుచేసిన సంస్మరణ సభలో అమహనీయుని ఆదర్శాలను సంస్మరిస్తూ, ఆచరిస్తూ ఆయన అడుగుజాడలలో నడుస్తూ దీక్షాదక్షులుగా అందరూ కావాలని వారు విజ్ఞప్తి చేశారు.

ఈ సభకు పబ్లికు వర్క్సుమంత్రి శ్రీ పి. వి. రాఘవులు అధ్యక్షత వహించారు.

చరిత్రలేని జీవితంలో చరిత్రలేనివాడుగా పుట్టి ప్రపంచ చరిత్రకారులలో ప్రముఖుడుగా అయిన శ్రీ శాస్త్రి "సార్థక జన్ముడని" శ్రీ రాఘవులు వర్ణించారు.

సాధారణ కుటుంబంలో పుట్టి చరిత్రనే ...

... గారల మృతికి సంతాపం వెలిబుచ్చుతూ తీర్మానించారు.

### పొన్నమండ

శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి మృతికి సంతాపం వ్యక్తపరచేందుకు పంచాయతీ సర్పంచ్ శ్రీ చేకూరి సుబ్బరాజు సభ ఏర్పాటు చేశారు. శ్రీ చలపతిరావు అధ్యక్షత వహించారు. ప్రపంచ శాంతికి శ్రీ శాస్త్రి చేసిన కృషికి జోహార్లర్పిస్తూ సర్వశ్రీ యు. సుబ్బారావు, కె. భీమారావు, సుబ్బారాయుడు, చేకూరిసింగరాజు, యు. వి. రెడ్డి ప్రభృతులు ప్రసంగించారు.

### మహబూబ్‌నగర్

కాల్‌వారి మెథాడిస్ట్ చర్చి, స్థానిక క్రైస్తవులు ఈ నెల 12 వ తేదీన సమావేశమై శ్రీ లాల్ బహదూర్‌శాస్త్రికి శ్రద్ధాంజలి ఘటించారు.

### నంద్యాల

నంద్యాల పట్టణ ఒకటవ మండల కాంగ్రెస్ సంఘం సర్వసభ్య సమావేశం సూనె పల్లిలో సంఘం కార్యాలయంలో జరిగింది. ప్రధాన మంత్రి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి శాంతి సాధనకు, దేశ రక్షణకు అవిరళ కృషిజరపి ...

# ** దినఫలం **

నూతన వ్యవహారాలకు జనవరి 24 సోమవారం మంచిది 25 మంగళవారం తిథి మంచిదికాదు. ఉదయం 10—33 గంటల వరకు నక్షత్రం మంచిది. తరువాత మంచిది కాదు. ప్రయాణాలకు జనవరి 24 సోమవారం తిథిమంచిది. ఉదయం 7.34 గంటల వరకు నక్షత్రం మంచిది. (శుభయోగం మంచిది) తరువాత సామాన్యం (అమృత యోగం మంచిది) 25 మంగళవారం తిథి మంచిదికాదు. ఉదయం 10.33 గంటల వరకు నక్షత్రం సామాన్యం (మృత్యుయోగం మంచిదికాదు) తరువాత మంచిదికాదు (కాల యోగం మంచిదికాదు) (వర్జ్యమును, దుర్ముహూర్తమును గమనించవలెను)

జన్మదినఫలం : జనవరి 24 కొన్ని వ్యవహారాల్లో మీరు భవిష్యత్తును దృష్టిలో ఉంచుకొని వ్యవహరించడంవలన ప్రస్తుతం మీరు పొందవలసినంత ఫలితాన్ని పొందలేక పోవచ్చును. నూతన వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తి రీత్యా ప్రయాణాలు చేస్తారు. ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. సాహిత్య కళా రంగాల్లో నూతన గౌరవాన్ని పొందగలరు. ఆరోగ్యం నూతన గౌరవాన్ని పొందగలరు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో స్వల్ప బేధాభిప్రాయాలు వస్తాయి. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కాగలరు.

## 24-1-1966 సోమవారం

(శక సం 1887 మాఘమాసం 4)

### మేషం

వృత్తి వ్యాపారాల్లో ఇదివరకు యేహో కారణాల వలన ఆగిపోయిన వ్యవహారాలను ఇప్పుడు లాభదాయకంగా పూర్తిచేయగలరు. సంతానసౌఖ్య సంతోషాలు లభిస్తాయి. మిత్రులు సహాయం చేస్తారు. భరణి నక్షత్ర జాతకులు మాత్రం జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం.

### వృషభం

వ్యాపారంలో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. పుణ్యకార్యాలు చేస్తారు. కృత్తికా నక్షత్ర జాతకులకు మిగిలిన వారికంటే అనుకూలంగా ఉంటుంది.

### మిథునం

మిన్నటికంటే ఈ దినం బాగా ఉంటుంది వృత్తి వ్యాపారల్లో యేర్పడిన చికాకులు తొలగిపోతాయి. భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు. ఆర్ద్రా నక్షత్ర జాతకులకు మాత్రం అనుకూలంగా ఉండదు.

### కర్కాటకం

ఇంతవరకు అనుకూలంగా ఉన్న వ్యవహారాల్లోనే కొత్త సమస్యలు తల యెత్తడంవలన ఆందోళన కలుగుతుంది. కుటుంబ వ్యవహారాల్లో స్వల్ప బేధాభిప్రాయాలు వస్తాయి. ఆరోగ్యం బాగా ఉండదు. ఆశ్లేషా నక్షత్ర జాతకులు మిగిలిన వారికంటే జాగ్రత్తగా వ్యవహరించడం చాలా అవసరం.

### సింహం

ఫలితంమాట యెలాగ ఉన్నా, ప్రయత్నించిన ప్రతి పనినులువుగా నెరవేరుతుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. కుటుంబ సంతోషం లభిస్తుంది. మఖా నక్షత్ర జాతకులకు మిగిలిన వారికంటే బాగా ఉంటుంది.

### కన్య

కొన్ని వ్యవహారాల్లో కార్యసాధనకోసం మీ అభిప్రాయాలకు విరుద్ధంగా వ్యవహరించవలసి ...



## తుంగభద్ర బోర్డు - అమ్మకం నోటీసు

ఈ క్రింద వివరించిన ఉపయోగములేని యంత్ర సామగ్రి మరియు విడి భాగములు కొనదలచినవారి నుండి ఈ క్రింది సంతకముదారుచే 28—2—66 తేదీవరకు సీలు వేసిన టెండర్లు కోరబడుచున్నవి. మెషినరీ విడి భాగముల పూర్తి వివరముల పట్టీలు, అమ్మకపు షరతులు, నిబంధనలు కావలసినవారు రు. 10—20 పై. వరకు సెట్టు ఖరీదు క్రిందచెల్లించి పొందిన ప్రభుత్వ ఖజానా చలానులో అక్నాలజిపై 5—2—1966 లోపువాల ఈ క్రింది సంతకముదారు నుండి పొందవచ్చును. పై సొమ్ము "ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్, సివిల్ డివిజన్, తుంగభద్రడామ్" వారి ఖాతకు "బి. ఎస్. ఎస్. ఎకౌంట్, ఆంధ్రప్రదేశ్ మరియు మైసూర్ ప్రభుత్వముల మధ్య" అను శీర్షిక క్రింద చెల్లించవలెను. లేక రు. 10—90కి క్రాస్ చేసిన డిమాండు డ్రాఫ్టు యే షెడ్యూల్డు బ్యాంకు మీదగాని తీసివంపవలెను.

| వరుస నెం. | వివరములు | అయిటములనెంబరు మొత్తము. |
| --- | --- | --- |
| 1. | షీరింగ్, బెండింగ్, త్రెడింగ్, డ్రిల్లింగ్ యంత్రములు, లేత్ భాగములు క్రేన్ భాగములు, పంపులు వగైరాల వంటి ఆటో యంత్ర పరికరములు. | 46 |
| 2. | పనిముట్లు, జి. ఐ., సి. ఐ. మరియు ఎం. ఎస్. పైపులు, స్పెషల్స్, పెయింట్లు, ఉక్కు పనిముట్లు ఎం. ఎస్. (స్టీల్స్), ఎలక్ట్రికల్ సామగ్రి, రోలింగ్ స్టాకు మరియు ట్రాంవే ప్లాంటు వగైరా వంటి జనరల్ మెషినరి విడి భాగములు. విడిభాగములు. | 3000 |
| 3. | కాలిక్సు, డ్రిల్, హాండ్‌డ్రిల్, వాగన్ డ్రిల్, జాకుహామర్స్, వైబ్రేటర్లు, రోడ్డు బ్రేకర్లు. | 97 |
| 4. | కోల్స్ క్రేన్, మెటల్యార్ డెర్రిక్, క్యాక్‌వేక్రేన్, క్యాక్ మిక్సర్, విన్‌మిక్సర్ పైరో మీటర్. | 104 |
| 5. | ఇంజన్లు : క్రాస్‌లీ, పిటోపెన్, రికార్డో, పెట్టర్, లిస్టర్, బూడా, హెర్క్యులిస్, జి. ఎమ్. డీసల్, ఎమ్. బి. 45, కమ్మింగ్స్. | 588 |
| 6. | మోటారుకార్లు : కామర్, ఫోర్డు, ఆస్టిన్, లాండ్‌రోవర్, బెడ్‌ఫోర్డు, స్టుడిబేకర్, చెవర్లెట్, డడ్జి, జీప్, జి. ఎమ్. సి. పెర్కిన్స్ మరియు జనరల్ ఆటో విడి భాగములు. | 1084 |
| 7. | క్రేనులు, షవల్సు, ఎకుస్కవేటర్లు : రైక్స్, పి. అండ్ హెచ్ మరియున్. | 607 |
| 8. | బంటర్స్:—ఏ. బి. మూరిహిల్ క్రాస్ఫింగ్ | 428 |

తుంగభద్రడామ్. పి. ఓ. హాస్‌పేట తాలూకా మైసూర్ స్టేట్.

ఎమ్. మారియప్ప, ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్, సివిల్ డివిజన్.

